
మాయా శంఖం
జపాను జానపద కథ

అనగా అనగా ఉత్తర జపానులో ఒక దీవిలో ఒక రైతు ఉండేవాడు. అతడు పేదవాడు, కానీ ఎంతో నిజాయితీపరుడు.  అతడి పేరు హొదెరీ. ఒక జమిందారి తోటలో అతడు పనిచేసేవాడు. ప్రతి రోజూ అతడు ఎంతో కష్టపడవలసి వచ్చేది. కానీ అతడు ఎప్పుడూ సంతోషంగా ఉండేవాడు.

ప్రతి రోజూ తన గుడిసె నుండి జమిందారు భవనానికి సముద్ర తీరం వెంట నడిచి వెళ్లేవాడు. అలా వెళుతూ పైకి లేచి, పడి, మళ్లీ లేచే అలలను చూడటం అతడికి ఇష్టంగా ఉండేది. సముద్రపు తీరంలోని మడుగులలోని చిన్న చిన్న సముద్ర జీవులను చూసి అతడు సంతోషించేవాడు.





ఒక ఉదయం ఒక చేపని మడుగులోకి తరిమిన ఒక పెద్ద చేపని హోదెరీ చూశాడు. అతడు పెద్దగా చప్పట్లు కొట్టేసరికి ఆ పెద్ద చేప వెళ్లిపోయింది. ఆ చిన్న చేప మళ్లీ సముద్రంలోకి వెళ్లలేక ఆ మడుగులోనే ఈదుతూ ఉంది.

“నిన్ను మళ్లీ సముద్రంలోకి వదిలిపెడతాను,” అన్నాడు హోదెరీ.

ప్రేమతో ఆ చిన్న చేపను తీసి సముద్రంలో వదిలాడు. “ఆ పెద్ద చేపకు దొరకకుండా తొందరగా వెళ్లిపో,” అన్నాడు.

అంత ఉదయమే ఒక మంచి పని చేసినందుకు అతడికి ఎంతో సంతోషంగా ఉంది. నాలుగు అడుగులు వేశాడో లేదో అతడికి వెనక నుంచి మాటలు వినిపించాయి, “కొంచెం ఆగండి.”

వెనక్కి తిరిగిన హొదెరి అందమైన బట్టలతో, తాను అంతకు ముందెన్నడూ చూడని దేవతలాంటి అందమైన స్త్రీ కనిపించింది. తన లాంటి పేదవాడితో ఆమెకి పని ఏమిటని తన దారిన తాను వెళ్లసాగాడు.

కానీ ఆమె మళ్లీ అతడిని పిలిచింది, "కొంచెం ఆగండి. సముద్రపు రాజు ఒకే ఒక కూతురిని మీరు కాపాడారు. మా నాన్న దగ్గరికి మిమ్మల్ని తీసుకెళతాను."

"కానీ నాకు ఈత రాదు. నేను రాలేను," హొదెరీ అమాయకంగా అన్నాడు. ఆ యువతి నవ్వుతూ, "నేను పెద్ద చేపగా మారతాను. మీరు వచ్చి నా వీపు మీద కూర్చుంటే చాలు," అంది.

హొదెరీ సముద్రపు ఒడ్డుకు వచ్చాడు. ఆమె పెద్ద చేపగా మారింది. అతడు ఆమె వీపు మీద కూర్చున్నాడు. ఆ చేప ఈదుకుంటూ సముద్రపు రాజు దగ్గరకు తీసుకుని వెళ్లింది.



సముద్రపు రాజు తన దర్బారులో ఉన్నాడు. హొదెరీనీ తీసుకొచ్చిన చేప అతడు అంతకు ముందు చూసిన అమ్మాయి కంటే అందంగా మారి రాజు పక్కన నిలబడి ఉంది. తన కూతురు ప్రాణం కాపాడినందుకు హొదెరీకి రాజు వంగి నమస్కరించాడు.

రాజకుమారి కురులు పట్టు మబ్బుల లాగా గాలిలో తేలుతున్నాయి. ఆమె బట్టలు అలల లాగా ఉన్నాయి. ఆమె గొంతు జలతరంగిణిలాగా తియ్యగా ఉంది. “నా ప్రాణాలు కాపాడినందుకు వేలవేల దండాలు,” అంది రాజకుమారి. “ఒక వేళ ఆ చేప నుంచి తప్పించుకున్నా ఆ మడుగులోంచి బయటపడ గలిగే దానిని కాదు.”

హొదెరీ ఎంతో వినయంగా, “ఈ సహాయం నేను ఎవరికైనా చేస్తాను,” అన్నాడు. హొదెరీని గౌరవించటానికి రాజు విందు ఇచ్చాడు. కళాకారులు పాటలు పాడారు, నృత్యాలు చేశారు. అందరూ సంతోషంతో సంబరాలు జరుపుకున్నారు. అప్పుడు రాజు, “నా కూతురిని కాపాడినందుకు నీకొక బహుమతి ఇవ్వాలని ఉంది. నీకు ఏది కావాలంటే అది కోరుకో,” అన్నాడు.



ఎవరికైనా సహాయం చెయ్యగలగటమే బహుమతిగా హొదెరీ భావిస్తాడు. అదే అతడికి సంతోషాన్ని ఇస్తుంది. అంతకు మించి అతడు ఏమీ కోరుకోడు. అదే అతడు రాజుతో చెప్పాడు. అయితే రాజు అందుకు ఒప్పుకోలేదు.

అప్పుడు హొదెరీ నలువైపులా చూసి, "మహారాజా, అలా అయితే నాకు ఆ శంఖం ఇప్పించండి," పాలతెలుపులో మెరిసిపోతున్న శంఖాన్ని చూపిస్తూ అన్నాడు. దాంతో దర్బారు అంతా నిశ్శబ్దం ఆవరించింది.

"అది మాయా శంఖం, అది తప్పించి వేరే ఏమైనా కోరుకో," అన్నాడు మహారాజు. "అలాగయితే ఆ శంఖం మీ దగ్గరే ఉండాలి, మహారాజా. నాకు ఏ బహుమతీ వద్దు," అన్నాడు హొదెరీ.

రాజు కొంచెంసేపు ఆలోచించాడు. తరువాత, "నా కూతురు ప్రాణాలు కాపాడిన నీకు ఏదీ ఇచ్చినా తక్కువే," అన్నాడు.

సేవకుడు తెచ్చి ఇచ్చిన శంఖాన్ని హొదెరీకి బహుమతిగా ఇచ్చాడు రాజు.





ఆ శంఖంతో హొదెరీని తిరిగి సముద్రం ఒడ్డుకు చేర్చారు. అతడికి వీడ్కోలు చెబుతూ, "ఈ మాయా శంఖం నీ జీవితాన్ని సంతోషాల్లో నింపుతుంది. దీని సహాయంతో నువ్వు అన్ని ప్రాణుల మాటలు అర్థం చేసుకోగలవు. అయితే దీనిని స్వార్థపరుల చేతిలో పడనివ్వకూడదు," అంది.

హొదెరీ జమిందారు ఇంటివైపుకి బయలుదేరాడు. దారిలో ఒక చెట్టుమీద పక్షుల కిలకిలలు వినపడ్డాయి. మాయా శంఖాన్ని పరీక్షించటానికి దానిని తన చెవి దగ్గర పెట్టుకున్నాడు హొదెరీ. ఆ పక్షుల మాటలు అతడికి వినిపించాయి. "తామే తెలివైన వాళ్లమని మనుషులు అనుకుంటారు, కానీ వాళ్లకి ఏమీ తెలియదు. ఈ చెట్టు కింద ఉన్న రాయి నిజానికి బంగారపు ముద్ద," ఒక పక్షి అంది.

ఆ పక్షుల మాటలు విని హొదెరీ ఆశ్చర్యపోయాడు. నాచుతో కప్పి ఉన్న ఒక రాయి ఆ చెట్టు కింద అతడికి కనిపించింది. ఆ రాయిని తీసి నాచుని తొలగించే సరికి అది బంగారం అని అర్థమయ్యింది. దానిని హొదెరీ తన చొక్కా లోపల దాచుకున్నాడు.

జమిందారు ఇంటికి చేరుకునే సరికి అక్కడ అంటించి ఉన్న ఒక ప్రకటన అతడికి కనిపించింది, 'నా కూతురు జబ్బు నయం చేసిన వ్యక్తికి అతడు కోరుకున్న బహుమతి ఇస్తాను.'

తోటలో తిరిగుతుండగా జమిందారు కూతురిని హొదెరీ చాలాసార్లు చూశాడు. అందమైన బట్టలలో ఆమె ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. పిట్టలకు గింజలు వేస్తూ ఉండేది.

ఆమెకి 'ఇంద్రధనస్సు రాకుమారి' అని తన మనస్సులో హొదెరీ పేరు పెట్టుకున్నాడు.



ఇప్పుడు ఆమెకే జబ్బు చేసింది. హొదెరీ ముఖంలో మొదటిసారి విచారం కమ్ముకుంది. ఆమెకి సహాయం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

లోపలికి వెళ్లి "మీ కూతురు జబ్బుని నేను నయం చేస్తాను," అని అతడు జమిందారుతో చెప్పాడు.

అతడి మాటలు విని అక్కడున్న ప్రముఖ వైద్యులందరూ నవ్వారు. "మాకే ఏం అంతుపట్టటం లేదు, నీ వల్ల ఏమవుతుంది?" అని అతడిని ఎగతాళి చేశారు.

జమిందారుకి తన కూతురు అంటే ప్రాణం. తన కూతురికి నయం అయ్యి, ఎప్పటి లాగా తిరుగుతూ ఉండాలని అతడి కోరిక. ఏ చేతిలో ఏ మహిమ ఉందో ఎవరికి తెలుసు?

"ఆమెను పరీక్షించి ఏం చెయ్యాలో చెప్పు," అని హొదెరీని ఆదేశించాడు జమిందారు.





లోపల గదిలో ఇంద్రధనస్సు రాకుమారి పడుకుని ఉంది. ఆమె చాలా నీరసంగా ఉంది. చాలా కష్టంగా ఊపిరి తీసుకుంటోంది.

తన మాయా శంఖం సహాయం చేస్తుందని హొదెరీ దానిని తన చెవి దగ్గర పెట్టుకున్నాడు. అయితే చుట్టుపక్కల ఎటువంటి పక్షి లేదా జంతువు, చివరికి పురుగు కూడా లేకపోవటంతో అతడికి ఏమీ వినిపించలేదు. దాంతో రాకుమారికి ఏం అయ్యిందో అతడికి తెలియలేదు.

అతడు నిరాశగా జమిందారు దగ్గరకు వచ్చాడు. “ఇప్పుడు నాకు ఏమీ తెలియటం లేదు. తెలియగానే మళ్లీ వస్తాను,” అని హొదెరీ చెప్పాడు.

వైద్యులు నవ్వుతుంటే తల దించుకుని వచ్చేశాడు హొదెరీ. తోటలో పనిచేస్తున్నా అతడికి ఒక్క పక్షి కూత కూడా వినిపించలేదు. పొదల్లో ఉండే తొండ కూడా కనిపించలేదు.

నీటి మడుగు దగ్గర ఎప్పుడూ ఉండే కప్ప అరుపైనా వినపడుతుందేమోనని పొద్దుగుంకే వరకు అతడు పనిచేశాడు.

ఆకాశంలో చుక్కలు కనిపించటంతో హొదెరీ ఇంటికి బయలుదేరాడు. అప్పుడు గుడ్లగూబ అరుపు వినిపించింది. వెంటనే మాయా శంఖాన్ని చెవి దగ్గర పెట్టుకోవటంతో దాని మాటలు అర్థం కాసాగాయి, "జమిందారు ఇంటి కప్పు నేసేటప్పుడు అందులో ఒక పాము ఇరుక్కుపోయింది. దానిని బయటకు తీసి ఆహారం ఇచ్చేవరకు అమ్మాయి జబ్బు నయం కాదు."

శంఖాన్ని లోపల దాచిపెట్టి హొదెరీ జమిందారు దగ్గరకు వెళ్లాడు. "మీ అమ్మాయికి ఏం జరిగిందో నాకు తెలిసింది," అతడు చెప్పాడు. "ఆమె మీద పాము ప్రభావం పడింది. ఇంటి పైకప్పు నేసిన గడ్డిలో చిక్కుకున్న పామును రక్షించి, దానికి ఆహారం ఇవ్వాలి."

ఆ మాటలకు వైద్యులందరూ మళ్లీ పెద్దపెట్టున నవ్వసాగారు.





కూతురి మీద ప్రేమతో ఏది చెయ్యటానికైనా జమిందారు సిద్ధంగా ఉన్నాడు. “కప్పు నేసేవాళ్లను వెంటనే పిలిపించండి,” అంటూ మనుషులను పంపించాడు.

ఆ రాత్రే కప్పు నేసేవాళ్లు ఇంటి కప్పుని ఊడదియ్యటం మొదలు పెట్టారు. కొంచెం సేపటికి గడ్డిలో చిక్కుకున్న పాము కనిపించింది. ఆకలికి అది సగం చచ్చి ఉంది.

జమిందారు స్వయంగా దానికి ఆహారం ఇచ్చాడు. పాముకి ఓపిక రావటంతో ఆ అమ్మాయి కూడా లేచి కూర్చుంది.

పాముకి మరికొంత ఆహారం ఇవ్వమని జమిందారు చెప్పాడు. పాము మెల్లగా పాకటం మొదలుపెట్టటంతో ఇంద్రధనస్సు రాకుమారి కూడా నవ్వుతూ బయటకు వచ్చింది.

జమిందారు ఎంతో సంతోషించాడు. హొదెరీ దగ్గరకు వెళ్లి తన కూతురి ప్రాణాలు కాపాడినందుకు అతడు కోరుకున్నది ఏదైనా ఇస్తానని అన్నాడు.

దయ హొదెరీ గుణం, ఇతరులకు సహాయ పడటమే అతడికి సంతోషం. ఇతరుల సుఖమే అతడికి బహుమతి. అందుకే అతడు, "నాకు ఏ కోరికా లేదు," అన్నాడు. అయితే మొదటిసారి అతడి మాటలలో నిజాయితీ లోపించింది. అన్నిటికి మించి అతడు రాకుమారిని కోరుకున్నాడు మరి.

ఏదో ఒక కోరిక ఉండే ఉంటుంది అని జమిందారు ఒత్తిడి చేసిన మీదట, దయ, అందం మూర్తీభవించిన రాకుమారివైపు చూసి, "మీ అమ్మాయితో పెళ్లి జరిపించాలని కోరుకుంటున్నాను," అన్నాడు.

అక్కడ ఉన్న వైద్యులందరూ నవ్వారు. "నిరుపేద అయిన ఇతడికి నీ కూతురిని ఎలా ఇస్తావు?" అన్నారు.

జమిందారు నిజాయితీపరుడు, కాసేపు ఆలోచించాడు.





చివరికి, "నా కూతురిని నా లాగా చూసుకోగలనంటే నీకిచ్చి పెళ్లి చేస్తాను," అన్నాడు.

అతడి మాటలు విన్న వైద్యులు మరింతగా నవ్వారు. మురికి బట్టల ఆ రైతు రాకుమారిని సంతోషంగా ఎలా ఉంచగలుగుతాడు? నవ్వి, నవ్వి వాళ్ల పొట్టలు నొప్పి పుట్టసాగాయి.

అప్పుడు హొదెరీ తన బట్టలలో దాచిన బంగారు ముద్దను బయటకు తీశాడు. "నీ కూతురు, మా పిల్లలు ఎల్లకాలం సుఖ, సంతోషాలతో ఉండటానికి ఇది సరిపోతుందని అనుకుంటున్నాను," అన్నాడు.

ఆ వైద్యుల నవ్వులు ఆగిపోయి బంగారు ముద్దవైపు కళ్లార్పకుండా చూడసాగారు. జమిందారు మాత్రం నవ్వి, "సరిపోతుంది," అంటూ తన అంగీకారం తెలిపాడు.

ఇంద్రధనస్సు రాకుమమారితో హొదెరీ పెళ్లి జరిగింది. జమిందారు ఇంట్లోనే వాళ్లిద్దరూ సంతోషంగా ఉండసాగారు.

ప్రతి రోజు ఉదయం హొదెరీ, అతడి భార్య తోటలోని పందిరి కింద కూర్చునే వాళ్లు. తమతోపాటు చాలా గింజలు తీసుకెళ్లి పిట్టల కోసం వేసేవాళ్లు. ఎవరూ తమని గమనించకుండా ఉండటానికి వాళ్లు సూర్యోదయం కంటే ముందే లేచి ఒకరి తరువాత ఒకరు మాయా శంఖాన్ని చెవి దగ్గర పెట్టుకుని అన్ని ప్రాణుల మాటలు వింటూ ఉండేవాళ్లు.



